Apparao, Gurujada Venkata, 1861-1915

ముత్యాల సరములు

విజయనగరము, 1929

Record no. 471

Apparao, Gurujada Venkata, 1861-1915

Mutyāla saramulu

Vijayanagaramu, 1929

Record no. 471

## Bibliographic Record Target

Apparao, Gurujada Venkata, 1861-1915.
ముత్యాల సరములు : చిన్న కధలు / గురజాడ వెంకటఅప్పారాయ విరచితము.- విజయనగరము : గురజాడ వెంకటరామదాసు, 1929.
ii, 100 p. :port. ;18 cm.
Record no. 471

Apparao, Gurujada Venkata, 1861-1915.
Mutyāla saramulu : cinna kadhalu / Gurajāḍa Veṅkaṭaappārāya viracitamu.- Vijayanagaramu : Gurajāḍa Veṅkaṭarāmadāsu, 1929.
ii, 100 p. :port. ;18 cm.
Record no. 471

# ముత్యాల సరములు

## చిన్న కథలు

గురజాడ వెంకట అప్పారాయ విరచితము.

గురజాడ వెంకటరామదాసుచే ప్రకటితము.

విజయనగరము.

శ్రీ రామానుజ విలాస ముద్రాక్షరశాల,
విజయనగరము.
1929.

With the best Compliments
of
T. V. Ramadas

# Foreword.

---

I publish the 'Mutyala Saramulu and short Stories of late Gurajada Venkata Appa Row Pantulu garu with a word. A really good book needs no introduction. The work speaks for itself. He was born in the year 1855 at Rayavaram in Yellamanchili Taluk and had his early education in Chipurupalli. Later on, he joined the college at Vizianagram and took his degree there. After leaving the College he joined the service of late, His Highness the Maharajah Sree Ananda Gajapati Raj as an epigraphist, and made a comparitive study of the Indian languages and Telugu in particular.

In 1895 the Maharaja collected the statistics of all the Child-marriages, contracted about that time throughout this District, and they came to number about some thousands. Two things struck the poet romantically inconsistent and dramatically stupid; the stunted literary condition of the living Telugu tongue and the foolish social practice, and he brought out his first social drama 'Kanya Sulkam,' in polite spoken Telugu. He continued in the service of the Vizianagram House until he retired in 1913. In the same year the Government nominated him as a life member of the Senate, of the Madras University.

In the Senate and outside, he worked much towards the linguistic reform of Telugu language, and created a new prose and poetic style and wrote in them. His first poem 'Mutyala Saramulu,' was composed in 1910, the year of the appearance of Hally's Comet and the Cosmopolitan dinner at Berahampur. Eliminating the incidentel poems such as, "Desa Bhakti, Yettu Langaru and Dinchu Langaru", the main theme of the poems is the development of love in its various stages. He experienced many difficulties in his early life and we find a few autobiographical reflections in his poem 'Yettu Langaru', some of the ideas in this poem call to our mind Tennyson's "Ulysses".

His newspaper articles and fragmentary writings are as much, and more interesting. I am making a collection of them and I hope to publish them shortly.

VIZIANAGRAM. }
20—1—29. }

G. V. RAMADAS.



గురజాడ వెంకటఅప్పారావుగారు

బి. ఏ. ఎఫ్. ఎమ్. యు.

# ముత్యాల సరములు.

1. గుత్తునా ముత్యాలసరములు
కూర్చుకొని తేటైనమాటల,
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెఱుంగులు జిమ్మగా.

2. మెచ్చనంటా వీవు; నీ విక
మెచ్చకుంటే మించిపాయెను;
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా?

3. తూర్పు బలబల తెల్లవారెను,
తోకచుక్కయు వేగుచుక్కయు,
ఒడయుఁడౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్నువీధిని.

4. వెలుఁగు నీటను గ్రుంకెచుక్కలు;
చదల చీకటి కదలబారెను;
ఎక్కడనో యొక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను:

5. మేలుకొలుపులు కోడికూసెను;
విరులు కన్నులుఁ విచ్చిచూసెను;

ఉండి, ఉడిగియు, ఆకులాడగ.
కొసరెనోయన గాలివీచెను.

6. పట్నమున పదినాళులుంటిని
కార్యవశమున పోయి; యచ్చట
సంఘసంస్కరణ ప్రవీణుల
సంగతుల మెలగి,

7. యిల్లుజేరితి నాటివేకువ;
జేరి, ప్రేయసి నిదురలేపితి;
"కంటివే" నేనంటి, "మింటను
కాముబాణం బమరియున్నది."

8. తెలిసి, దిగ్గునలేచి, ప్రేయసి
సన్నగానక, మిన్నుగానక,
కురులు సరులును కుదురుజేయుచు
ఓరమోమిడ, బల్కితిన్.

9. ధూమకేతువు కేతువనిమో
మోముచందురు డలిగి చూడడు?
కేతువాయది? ప్రేల్పులలనల
కేలిపెలితోగ కాంచుమా!

10. అరుదుగా మిను చప్పరంబున
చొప్పుతెలియని వింతపోడముగ,



చిన్నకాలపు చిన్నబుద్ధులు
బెదరి యెంచిరి కీడుగా.

11. అంతెకాని రవంతయైనను
వంతనేగతి సూపనేర్చనె,
నలువ నేమి కంటియుదియాన
నింగితోడవయి వ్రేలుచున్-

12. కవుల కల్పన కలిమినెన్నో
వన్నె చిన్నెలు గాంచువస్తువు
లందు పెట్టి పురాణగాథలు
నమ్మజెల్లునె పండితుల్.

13. కన్నుకానని వస్తుతత్వము
కాంచనేర్పరు లింగిరీజులు;
కల్లనొల్లరు; వారవిద్యల
కరచి సత్యము నరసితిన్.

14. దూరబంధువు యితడు భూమికి,
దారిబోవుచు చూడవచ్చెను_
డబ్బదెనుబది రేండ్ల కొకతరి
నరుల కన్నుల పండువైనె.

15. తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు జెందుట దేటికార్యము?

తలతు నేనిది సంఘసంస్కర
ణప్రయాణ పతాకగాన్-

16. చూడు మునుమును మేటివారల
మాటలనియెడి మంత్రమహిమను
జాతిబంధములన్న గొలుసులు
జారిసంపదలు బ్బెడున్.

17. యెల్లలోకము వొక్కయిల్లై,
వర్ణభేదము లెల్లకల్లై,
వేలనెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియు.

18. మతములన్నియు మాసిపోవును,
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును;
అంతస్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్-

19. మొన్నపట్నమునందు ప్రాజ్ఞులు
ముట్టమొదటిది మెట్టుయిదియని,
పెట్టినారొక విందు జాతుల
జేర్చి; వినవైతో?

20. అంటినేనిట్లంత ప్రియసఖి
యేమిపలుకకయుండి యొకతరి,



పిదప కన్నులనీరు కారుచు
పలికె నీరీతిన్.

21. వింటి మీపోకిళ్లు వింటిని,
కంట నిద్దురకానకుంటిని;
యీచిన్నమనసున చిన్నబుచ్చుట
యెన్నికనియోచించిరో?

22. తోటికోడలు దెప్పె; పోనీ;
సాటివారో దార్చె; పోనీ;
మాటలాడక చూచినవ్వెడి
మగువ కేమందున్.

23. తోడుదొంగని అత్తగారికి
తోచెనేమో యనుచుగుందితి;
కాలగతియని మామలెంతో
కలగ సిగ్గరినై.

24. చాలునహా! మీచాకచక్యము.
చదువుకిదె కాబోలు ఫలితము!
ఇంతయుగునని పెద్దలెరిగిన
యింగిలీషులు చెప్పుదురా?

25. కోటపేటలు నేలగలరని
కోటివిద్యలు నాకుకరపిరి;

పొట్టకూటికి నేర్చు విద్యలు
పుట్టకేట్లు కదల్చునా?

26. కట్టుకున్నది యేమికానీ;
పెట్టిపొయ్యకపోతె, పోనీ;
కాంచి పెంచిన తల్లిదండ్రుల
నైన కనవలదో?

27. కలిసి మెసగిన యంత మాత్రన
కలుగబోదీ యైకమత్యము;
మాలమాదిగ కన్నె నవతెనో
మరులుకొన రాదో?

28. అనుచు కోపము నాపజాలక
జీవితేశ్వరి పరులు నామై
చెరచి చనె క్రొమ్మెరుగు చాడ్పున
మనసు వికలముగాన్.

29. తూర్పు బల్లున తెల్లవారెను;
తోకచుక్క యదృశ్యమాయెను;
లోకమందలి మంచి చెడ్డలు
లోకు లెరుగుదురా?

# కొసులు.

1 మనలకీ పోరాట మిప్పుడు
దేనిగూరిచి కలిగె చెప్పుమా,
మరచితిని;...సఖ్యావనదేను?
యేమికారణమైన పోనీ;

5 వినుము...ధనములు కొంపు తెరంగులు;
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ
ము, దయను నిద యొక్కడను కలుగును
యగును; సతులకు వేషతగినది

10. యెద్దియో?
"మనసులో నిసుంపు
ధనమన నొంచు కలదే పసిడి
గాకని. ప్రాజ్ఞలకె కనికట్టు
కనకము; చపలచిత్తుల కన్ను
చెదరుట చిత్రమా! తీవలకు

15. తలిరుల తెరంగున, కాంచనము
సింగారమందురు లలనలకు;
కానిమ్ము; గాని, కమ్మని తావి
గ్రమ్మెడి పుష్పనివయము పేర్చినా
కా? అదిలేక మించిన కెంపు,

20 కాంతల యందము
"ప్రేమ కొసరకు
తిందురా? యెట్టిదది? నావలను
కలదో, లేదో?" యను నొక వింత
చూపును చూచెదవు-

24 బంగరు
మిసిమి మేనికి పసపుసలదితి;
కురుల నలరుల నూనెనించితి;
కాటుకను మెరుగిడితి చూడ్కికి;
విడెము వింతహారంగు గూర్చెను
వాతెరకు; పలువరుస వెన్నెల

30 లలమె; దాన దానను, మురువు
పెనగొనె, నేర్చిమెరసితిసొంపు
ప్రేమ పెంచక పెరుగునే?
ప్రేమ-
పెన్నిధగాని, యింటను నేర్ప
రీకళ, ఒజ్జలెవ్వరు లేరు-

35 శాస్త్రిము లిందుగూరిచి తాల్చె
మానము- నేను నేర్చితి భాగ్య
వశమున, కవులకృపగని, హృదయ
మెల్లను నించినానను ప్రేమ



యను రతనాల- కొమ్మ!
తొడవులుగ నవిమేనదాల్చుట

40 యెటులనంటివో? తాల్చితదె, నా
కంటచూడుము! సతుల సౌరను
కమలవనముకు పతుల ప్రేమయె
వేవెలుగు ప్రేమకలుగక బ్రతుకు
చీకటి॥

నానేర్పుకొలదది

45 (ప్రేమ విద్దెకు నోసవాలివి,)
యెదను నిల్పిన, మేలుచేకురు
"మరులు ప్రేమని మదిదలంచకు;
మరులు మరలును వయసుతోడనె;
మాయ, మర్మములేని నేస్తము

50 మగువలకు మగవారి కొక్కటే
బ్రతుకు సుకముకు రాజమార్గము-
ప్రేమనిచ్చిన, ప్రేమవచ్చును-
ప్రేమనిలిపిన, ప్రేమనిలుచును"
ఇంతియె-

55 కాసు వీసము నివ్వనొల్లక;
కవితపన్ని తినని తలంపకు;

కాసులివె; నీ కంఠసీమను
జేరి బంగరు వన్నెగాంచుత!
మగడు వేల్పన పాటమాటది;

60 ప్రాణమిత్రుడ నీకు నీవెనరు
కలుగక యున్న, పేదను కలిగినను
నాపదవి వేల్పులకేని కెక్కడ?

# లవణరాజుకల.

1 నిండు కొలువున లవణుడను రా
జుండె. జాలికు డొకడు దరిజని,
దండినృప! యొకగండు గారడి
కలదు కనుమనియెన్

2 అల్లపింఛము నెత్తినంటిన
వెల్లగుఱ్ఱం బొకటి యంచల
పల్లటీల్పస నొడయు నల్లము
కొల్లగొని వచ్చెన్

3 వచ్చి నిలిచిన వారువంబును
యచ్చెరువుపై కొన్న చూపున
మెచ్చు మేరలు గనక చూసెడి
నృపుని కతడనియెన్

4 "ఉత్తమాశ్వంబిది నరేశ్వర!
చిత్రగతులను సత్వజవముల
చిత్తమలరించెని/జనుమిక
మనసుగల చోట్లన్"

5 చూపుదక్కగ చేష్టలుడిగెను
చూపరులు వెరగంద నృపునకు;

యేపుచెడి, శోకక్రాంతతడవున
కెరగి, నలుగడలన్

6 కలయజూసెను, కల్లనిజములు
కలకజెందిన మనసులోపల
మెల్లమెల్లన పూర్వజ్ఞానం
బల్లుకొని పొడమ।

7 "యేడిజాలకు డేది యశ్వం
బేదు లెన్నోగడచెనని యన్నృపు
"డేడునిమిషములేవి ప్రభువా!"
యనిరితన భృత్యుల్।

8 కలదులేదను రెండుభ్రాంతుల
కలయగూర్చకు బుద్ధిబలమున
కాలమహిమకు వెరగుజెందుచు
లవణు డిట్లనియెన్

9 ఏడు నిమిషము లేడులాయెనొ?
యేడునిమిషములందు యిమిడెనో
తేడులెన్నో? యింతలంతలు
చింత చేయునొకో!

10 యెక్కినట శోకమాయగుఱ్ఱం
బొక్క నరపతి మనసు నిలవక;
యెక్కినంతనె పరవశంబై
యెగసె నది యెటకో।



11 కన్నుమిన్నును కనిని జవమున
కాననంబులు గడిచియెన్నో,
యెన్నజీవం బొక్కటేనియు
లేనిమరుభూమిన్

12 మట్టిచనె, సంస్కృతిని జీవం
బట్లు; యిరులుతు మరుల వేళకు
తుట్టతుదకొక గున్నయడవిని
బట్టిగమనంబున్

13 మందగించిన, మానవేంద్రుం
డందుకొనె నొకకొమ్మ నల్లుకు
కిందు వ్రేలెడితీవ; గుఱ్ఱము
ముందువలె పరచెన్।

14 అడుగు పుడమిని తగిలినంతనె,
బడలి యుంటను నిదురపాలై
ఒడలు తెలియక వ్రాలినరపతి
చాగె మతునట్లన్।

15 పిదప జన్మాంతరము తెరగున
నిదుగజారినవేళ, కన్నుల
యెదట వెలసెను వింతలోకము
సంజ కెంజాయన్।

16 “వెలుగు నీడలు కనులకింపై
మెలగి చెలగెడు నాకసంబున
వ్రేలు మబ్బుల యంచులంటుచు
రగిలె రత్నరుచుల్।

17 పారెపక్షులు పౌఁజుపౌఁజుల;
జీరెకోయిల లొకటి వొకటిని;
దూరి గూడుల బాసలాడెను
పిట్టలెల్లజెలన్।

18 గగనరాజ్యము గ్రిమ్మువేడుక
మ[illegible]టిమిని తనకళలు గూర్చుచు,
పగలువెన్నుసదన్ని సోముడు
పైనమై వెడలెఁ।

19 తాడివనములు తూర్పుకొండను
గొడుగులెత్తెను; చామరంబులు
నడిపె జీలుగు లుడుగణంబులు
దవ్వులను నిలిచెన్।

20 చల్లగాలులు సాగి యలలుగ
జల్లుజల్లునరాల్చె పూవుల;
ఉల్లమలరెను; ఆకలొక్కటె
బడబడవలెఁ నడరెన్।



21 అంతచెవులకు దవ్వుదవ్వుల
వింతగానం బొకటి సోకెను
సోకినంతనె పూర్వవాసన
పిలిచినట్లాయెన్।

22 మరిచె నాకలి; మరలెనిడుములు;
పరవశుండై నృపతి, గానము
దరియు, గాంచెను శ్యామలాంగిని
నొక్కజవ్వనినిన్।

23 అరమొగిడ్చిన కన్నుగవతో,
చెదరియాడెడి ముంగురులతో,
బెదురుయెరగని బింక మొప్పెడు
బెడగు నడకలతో;

24 “కుంటి కడవను బుజమ్ముపైనిడు
వాటమది యొక మురువు గులుకగ
పాటపాడెను, పాటలాధరి
చెట్లునామలకై।

25 పాటపాడెను, చెట్లుచామలు
కోటిచెవులను గ్రోలియలరగ;
తాటివనమున నాగిచందురుడు
తానుచెవి యొగ్గెన్।

26 ఎవనిగూరిచి పాటపాడెనో?
యెవనినామము ధన్యమాయెనో?
లవణుడను మాటొకటి నాచెవి
తాకినట్లయ్యెన్।

ii

27 మంచివలెనిది మాయమగునని
యెంచి, యించుక సంశయించక
కించలన్నియు తొలగి వెంబడి
వేడి యిట్లంటిన్।

28 వినుము, కిన్నరి! నీకుదైవం
బన్నిశుభములు గూర్చుగ వుత!
నిన్ననుండియు నన్న మెరగని
యాకలాకవంకన్।

29 "అంతకన్నను అధికతరమొక
వింతయాకలి మనసు గ్రాచెను;
యింత అంతని చెప్పనేరక
యిట్లు వెంబడితిన్।

30 అనగ కన్నియు, తిరిగిమెల్లన
నన్ను కన్నులు విచ్చి చూసెను;



పూర్ణ బ్రహ్మాండాధి రాజ్యము
పూనినట్లయ్యెన్।

31 చూసి, కన్నులుడించి, మఃతల
పోసి, మిన్నక తోవసాగెను;
బాసెబింకము బెడగునడకల;
ముగిసె గానంబున్।

32 పండువెన్నెల కుముదవనిపై
నిండుగమ్మిన నీడకైవడి
నిండె మోమున చింతయొక్కటి;
మరల నేనంటిన్

33 "అన్నమిమటా కొన్నవారల
కెన్న సుకృతత మంబటంచును
మున్ను పెద్దలు బల్కురది నీ
వెరుగ కుందువే?

34 "భృత్యునైతిని నీదుమూర్తికి;
భృత్యునౌదును నీకు సుందరి!
మృత్యుముఖమున నున్న భటునకు
నన్న కావలదో?

35 చన్నబ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్నుమనసుకు కొంతతోచెకి;

నిన్నయున్నదె, నేఁడు రేపులు
అన్య నెట్లగుదున్?

36 "మానమూసిన, మరల గలనని
మదిదలంపకు'మంటి; కన్నియ,
గమనమించుక మందగించి
శిరంబువంచి యనెన్

37 "వన్నెమీరిన మేనిపసతో
కన్ను మణగెడి రత్నరుచితో
నన్ను తెలియక నాసచేసెద
వయ్యొ! మాలిత నేన్,

38 "అయ్యకోసము కూడుకొందును!
ఇయ్యలేనను మాట, హృదయము
వ్రియ్యచేసెడు; నాదు భాగ్యము
కెవరి నేమందున్,

iii

39 "అన్న పలుకు విసంపుభల్లము
కన్నవాడయి మనసు మాసెను;
కన్నె కన్నులనీరు గమ్ముటకాంచి
ఖిన్నుడనై"



40 కొన్ని నిమిషము లెన్ని యెన్నో
కన్న విన్నవి ధర్మములనే
నెన్నుకొని, నొకపరమధర్మము
నప్పుడు గనుగొంటిన్।

41 మలినవృత్తులు మాలవారని
కులము వేర్చిన బలియు లోకదే
శమున కొందరి వెలికి దోసిరి
మలినమే, మాల

42 కులము లేదట వొక్కవేటున
పసరముల హింసించువారికి;
కులము కలదట నసుల వ్రేచెడి
క్రూరకర్ములకున్

43 మలిన దేహుల మాల లనుచును
మలినచిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణధర్మము
ధర్మ ధర్మంబే।

41 ఆనెడు నిశ్చయ మాత్మదోపగ
వినుము, కన్నియ!" యంటి 'యెదు[illegible]
జనులు తెలియక పలుకు మాటకు
జనదువగ వంగన్

42 మంచి చెడ్డలు మనుజులందున,
యెంచి చూడగ, రెండెకులములు;
మంచియున్నడ, మాలయైత్తే,
మాలనే, అగుదున్।

46 తెలివి యొలికెడి తేటకన్నులు
మురువు గులికెడి ముద్దుమోమును
వేల్పు చేడియలైన నేరని
గానమాధురియున్,

47 చిత్తరవులందైన గనని ప
విత్రరూపపు సౌష్ఠవంబును,
ఉత్తమోత్తమ జాతిలక్షణ
యుక్తి సంపదయున్

48 మాల యనువారున్న, వారల
మందబుద్ధికి నగవవలె; తన
యందులేని కొరంత కలదని
నగవగానేలా ?

49 నమ్ము నేననుమాట తెరవ! భ
యమ్ము నాయువను; కూటినిడి చే
కొమ్ము నాహృదయంపు రాజ్యము
నిస్సపత్నముగాన్''



50 విని యెఫ్రిడా విస్మయంబులు
ఆననంబున పొడమి పొరగ
కనులనెత్తుచు, డించుచును నను
కాంత యిటుబలికెన్

51 తండ్రికోసము తెచ్చుకూటిని
—తిండికై యొటు కెట్టులిత్తును?
పెండ్లియాడిన—పెనిమిటొకనికి
———పెట్టధర్మంబా।

52 తడవు ఆయెను: తల్లడిల్లుచు
తండ్రినాకై యెదురుచూసును
అనుచు నన్నా తొలంగు భావము
అతివ అగుపరచన్

53 కరముబట్టి యురంబు యురమున
జేర్చి, ముద్దిడికురులు దువ్వితి;-
తాళవనమును వెడలి చంద్రుడు
పక్కనను నవ్వెన్।

54 ఆడబోయిన తీర్థమెదురై
వేడబోయిన వరము వచ్చెను;
పెండ్లియాడెద చంద్రుసాక్షిగ
పెట్టుకూడంటివెన్।

55 మున్ను వేల్పులు వెన్నచేతను
గొన్న యమృతము కన్న రుచులను
చెన్నుమీఱెను కూడు, కన్నియ
చేతనిడినంతన్।

iv

56 'వచ్చితివ యల్లుండ!' నీకై
వేచియుంటిని యింతకాలము;
యిచ్చితిని, చేకొమ్ము కూతుల
ప్రాణమది నాకున్।

57 'వచ్చితిమి యెటనుండొ?' అటబో
నిచ్చ మెండైయుండు మనమున;
పసిడిగొలుసులు, బిడ్డనాకై
పట్టి నన్నుంచెన్।

58 'ఇహము లోపలి మంచియంతయు
యిమిడియున్నది దీని ఆత్మను;
ముక్తికాంత తుదకు నీకిది
ముందుగతి చూపున్।

59 'కరపినాడను పరము మరవక
యిహమునందున మనెడు మర్మము;



కోటితపముల పుణ్యఫలమిది
కొమ్ము నీకిస్తిన్।

60 మాలనైనను మలినవృత్తులు
మానుకుంటిని గురువుదయచే;
పొలములోపల పశుల మేపుచు
పొట్టపోషింతున్

61 'మలినవృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీవనాంతము;
పల్లెకలదిట; ప్రాజ్ఞులందలి
ప్రజలు మావారల్।

62 'పాడిపంటలు గలవు తామర
తంపరలు మాపశులమందలు;
జంతుహింసను చేయనొల్లము
భూతదయ మతము।

63 కాని మనుజుని బుద్ధిలోపల
కలవు తనమేలొరులకీడును
తలచు వృత్తులు; కానబోయిన
కలుగు నెవ్వారిన్।

64 'మాన్పగలిగితి కత్తికోతలు;
మాన్పవశమే; మాటకోతలు?

కత్తి చంపును; మాటవాతలు
మాన వేనాడున్।

65 ‘నాటునను గలయట్టి యిడుములు
కాటియందును కలవు; ఓరిమి
యేటికైననుమందు; కలిగిన
కలుగు సౌఖ్యంబుల్

66 ‘మేలుకొను డొండొరుల; సిరులకు
మిట్టిపడకుడు; కీడుమూడిన
నాడుకుంగకు డొరులమేలుకు
పాటుపడు డెపుడున్’

67 అనుచు పలికెను వేదవాక్కులు
మన్కుచేతులుబట్టి కన్నియ
తండ్రి, తొల్లిటి ఋషియితండని
తోచచిత్తమునన్।

68 పండు గెడ్డము; నిండుకన్నుల
నిండ శాంతరసంబు; పలుకుల
కడలి గాంభీర్యంబు, యొడలిని
దివ్యతేజంబున్।

69 కలిగి కూచునె రాజఋషివలె
రావికిందను రచ్చశిలపై



కొమ్మలను జారి చంద్రికాంతులు
మేన చెదరంగన్।

70 అంతనుండియు కొన్నిపంటలు
కాంతతోనటు స్వర్గ సౌఖ్యము
లొంది మంటిని; చక్రవర్తుల
కొమరులను కంటిన్।

71 చిత్రమూ కొమరులను తగులుట
కొత్తశృంఖలయంచు మాముని
వృత్తిమార్గముపట్టి, దేహము
వాసె యోగమునన్।

72 పల్లెలోపల బొమ్మలాటలు
అల్లుకొనె, ఆనాటనుండియు
యెల్లవారలు పెద్దలగుటకు
యెంచిచూడంగన్।

73 సన్నగిల్లెను సాగుపొలమున;
వున్నదెల్లను తిన్నపిమ్మట
తినిరి పెంచినపశుల చంపకు;
అవియు కడితేరగ।

74 చెల్లచెదరై పరచిరందరు
యెల్లదిశలను; పరచుముందర

కొల్లకొని రేనున్న పొలమును
పండి మేముండన్।

75 తెల్లవారిన నుండి మేమును
పిల్లలము పడ్డట్టి పాటులు
ఝల్లుమనియెడు నొడలుతలచిన
చాల, చెప్పంగన్।

76 "అడవియందలి కాయకసురులు
కుడువనేరక బడలెబిడ్డలు;
అడవి ద్రిమ్మరి కడకు ప్రాణము
చేరినేనుంటిన్।

77 "ప్రాణసఖి నను పిలచియప్పుడు
పలికె స్మితముఖియై వినుండిక
చేయుకార్యము లేదు; చెల్లెను
ముందుగనవలయున్।

78 "కడకు జేరితి మీభవంబున;
తడవు లేదిక; మనసు తిప్పకు
గడగవలె రాబోవు భవమున
జ్ఞానసంపదకై।

79 "కష్టసుఖముల తీరులెన్నన
దృష్టములు—మనసత్యవర్తన



కాచుగావుత, కావగలిగిన
కన్న పసివాండ్రిన్!

80 "చింతయుడుగుడు—చితినిజోత్స్నము
యింతకన్నను భాగ్యమున్నదె!
అంతమున మతియట్టులుండునొ
అట్టిగతిగన్గున్।

81 "కలుగు భవములుకూడ నీతో
కలిసి గడపుచు ముక్తి జెందెద-
కలదె నీప్రణయాతిరేకము
కన్న సద్గతియున్"?

82 "అనుడు, చింతలు వాసి, కై కై
జేర్చి జొచ్చితి మపుడు చితి"

V

83 పలికె నిట్టుల పటువిషాదన
మాకులేక్షణుడగుచు లవణుడు;
"కలగ వలదిది మాయసర్వం"
బనిరి శాస్త్రిజ్ఞుల్।

84 లవణు డనియెను, బొమలు ముడివడ,
"కలగవలదట! కల్లయిదియట!

కలిగి నదిలేదన్న యంతనె
తొలగునట వేధల్!

85 "పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వమెరగక, శుకములగుదురు
నేఁటి శాస్త్రజ్ఞుల్!

86 "యెప్పటికి అనుభూతమెద్దియొ
అప్పటికి యదినిక్కువంబే
యెప్పుడో లోకంబు కల్లగు;
ననుట యిపుడెట్లో,

87 "చిత్తమందున కీలితములై
నిత్యభేదము నిచ్చు తలపుల
నెత్తివైచును?—లేరె, హా!, యిది
చెప్పగల ప్రాజ్ఞుల్?

88 "యెక్కడిది, ఆమాయదేశం
బెక్కడుందురు నాదుబిడ్డలు?
ఒక్కరైనను జూపలేరే
నాదు ప్రాణసఖిన్?"

89 నృపుడు యిట్లని శోకభార
మ్మాపగాన శక్యమ్ముగా కిరు



కేలకన్నులుమూసి, చింతా
మగ్నుడై యుండెన్।

90 అంతదుర్గ ద్వారసీమను
వింత కలకల వినగనయ్యెను;
చెంత ద్వారికుడేగి నృపునకు
తెల్పె 'నొకమునియున్',

91 "వారువముపై నొక్కకన్నియ
వచ్చి నిలిచిరి ద్వారసీమను"
'చెచ్చెరను తెమ్మ'నియె నరపతి
నోటమాటుండన్।

92 జొచ్చె నాస్థానాంగణం బపు
డప్సరాకృతి నొక్క కన్నియ;
అచ్ఛవర్ణపు టశ్వరాజం
బొక్క తాపసుడున్।

93 "పలికె తాపసుడతుల సౌఖ్యం
బధిప! నీకౌగాక! యవనుడు,
సింధు దేశాధిపుడు, పితృసఖు
డంపె కానుకగా

94 "తనదు గాదిలిపట్టి, యీయమ
వినయ విద్యాసద్గుణాన్విత;

కోరె నీనెయ్యంబు; నీగుణ
సంపదకు నలరెన్।

95 పంపె నీకీ యశ్వరాజం
బెందులే దిద్దాని కీడ'నె—
చెవిని మాటలు సోకి సోకక
లవణు డక్కొన్నం

96 జూచి స్మయహర్షాతి రేకము
లాత్మ పెనగొన; డాసి, చేకొని
'వచ్చితివ, నాప్రాణసఖి!' యని
గద్దియను జేర్చెన్॥

---

# కన్యక.

1 తగటు బంగరు చీరకట్టి
కురుల పువ్వుల సరులుజుట్టి
నుదట కుంకుమ బొట్టుపెట్టి
సొంపు పెంపారన్

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నెపరతెంచెన్
రాజవీథిని.

2 పసిడి కడవల పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్లుపువ్వులు
మోము లందున మొలక నవ్వులు
చెలగ చెలికత్తెల్
వెంటనడిచిరి.

3 అంత పట్టపు రాజు యెదురై
కన్నె సొగసుకు కన్నుచెదురై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్.

4 “ఔర! చుక్కల నడుమ చందురు
డట్లు వెలిగెడు కన్నె ముందర
వన్నె కాంచిన నగరి సుందరు
లందరొక లెక్కా?

5 “పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరుని రాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసికమండలిలో”

6 నాలనడుమను నట్టివీధిని
దుష్టమంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
పట్ట నుంకించెన్.

7 మట్టి వచ్చిన దైవగతికిక
దైవమేగతి యనితలంచుక
దిట్ట తనమును బూని కన్నియ
నెట్టనిటుఁ బలికెన్.

8 “ముట్ట బోకుడు దేవకార్యం
తీర్చివచ్చెద, నీవు పట్టం
యేలు రాజువు, సెట్టికూతుర,
నెటకు పోనేర్తున్”



9 సుట్టములు తన చుట్టు నిలవగ
భృత్యవర్గం కాచికొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
ఇట్లు వినిపించెన్.

10 “పట్టమేలే రాజ! బలిమిని
పట్టవలెనా? నీదు సొమ్మే
కాద కన్నియ? నీవు కోరుట
కన్న మరికలదా
వైశ్యజాతికివన్నె!

11 “గానిమన్నన జేసి మమ్ముల
బంధువర్గం కులం పెద్దల,
ధర్మమన్నది అరసి కొంచం
దారి కనపడితే,

“అగ్నిసాక్షిగ కన్నెగైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మేం తంతవలసిన,
మనుచు మాజాతిన్”

12 నవ్వి పేళన నవ్వు, నరపతి
పల్కె “సోహో! ధర్మ మార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కగపడమా!

"రాజు తలచిం దేను ధర్మం
రాజుచెప్పిం దల్లా శాస్త్రం
రాజులకు పే రైన పద్ధతి
కాద, గాంధర్వం?"

"తడవు చెయ్యక తల్లడిల్లక
నేను రేపని గడువు పెట్టక,
నెమ్మిగోరితి వేని, కన్నియ
నిమ్మ!
లేకుంటే, పొమ్ము!

"వేగ, పెట్టను పట్టివిడుచున?
కన్నె, యింటికి మరలినదుచున,
తెమ్ము కానుక లిమ్ము, నీవిటు
వచ్చినందాకన్

13 కదే." నంతట సెట్టి పలికెను,
"దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద రాజా!
తలవునీవిస్తె-

"యింటి దైవం వీరభద్రుడి
దేవళానికి పోయియిప్పుడె
పళ్లెరంసా గించి వత్తును
పైని తమచిత్తం!"



14 "మంచిదే, మరి నడువు, మేమును
తోడవత్తుము, దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
"మందుకొనగలము.

ii

15 నాడు గుడిలో మండె గుండం
మంట మింటిని ముట్టయాడగ
కన్న నరపతి గుండె దిగులై
పట్టు విడజొచ్చెన్

16 భక్తిపరవశ మైన మనసున
దుర్గనప్పుడు కొలిచి, కన్యక,
ముక్తివేడుచు ప్రాడ్వి నగలను
శక్తికర్పించెన్.

17 దుర్గకొలనున గుళ్ళికి పిమ్మట
రక్తగంధం రక్తమాల్యం
దాల్చి గుండం చుట్టునిలిచిన
జనుల కిట్లనియెన్.

"అన్నలారా తండ్రులారా
ఆలకించం డొక్కవిన్నప
మాలుబిడ్డల్ల కానుకొనుటకు

ఆశలేదాకో
కులములోపల?

"పట్టమేలే రాజుఅయితే
రాజునేలే దైవముండడా?
పశువునిలపను పౌరుషము మీ
కేలకలగదాకో?

"విద్యనేర్చిన వాడు విప్రుడు
వీర్యముండిన వాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి
మరచి, పశువులకై

"ఆశచేయక, కాసువీసం
కలిగివుంటే చాలుననుకొని,
వీర్యమెరగక, విద్యనేర్వక,
బుద్ధిమాలినచో

"కలగవా యికట్లు? మేల్కొని,
బుద్ధిబలమును బాహుబలమును
పెంచిదైవము నందు భారం
వుంచి, రాజులలో

"రాజులై మను డయ్యా!" ఇట్లని
కన్య నరపతి కప్పుడెదురై



నాలుగడుగులు నడిచిముందుకు
పలికె నీరీతిన్

"పట్టపగలే, నట్టివీధిని
పట్టబోరే జారచోరులు
పట్టదలచితి వింక నీవాక
పట్టమేలే రాజువట!

"కండకావర మెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వాక దైవమంటూ,
వుండి వూర్కొనునా?

"కులంపెద్దలు కూడి రదుగో!
అగ్నిసాక్షికి అగ్ని అదుగో!
కన్నుకోరిన కన్నెయిదిగో!
జాలమేలాకో?

"పట్టమేలే రాజువైతే
పట్టునన్నిపు" డనుచుకన్యక
చుట్టి ముట్టిన సీమంటలోనికి
మట్టితాజనియెన్

పట్టమేలే రాజుగర్వం
మట్టికలిసెను, కోటపేటలు

కూలి, నక్కల కాటపట్టై
ఆమరె

యొక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంటగలిసెనో
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై

పట్నమేలే రాజు పోయెను,
మట్టికలిసెను కోటపేటలు,
పదం పంద్యాం పట్టినిలిచెను
కీర్తు లపకీర్తుల్,"

# డామన్ పితియస్.

1 వన్నెకెక్కిరి డమను పితియసు
లన్నయనుజులు ముజ్జగంబుల
మున్ను; వారల స్నేహసంపద
నెన్న సుకృతింబా॥

2 ఒక్కనాడా సీమ జనపతి
యక్కజంబగు కోపభరమున
"వ్రక్కలించుము డమను శిరము"ని
పలికె తలవరితోన్.

3 చెక్కుచెదరక నిలిచె డమనుడు
"నిక్కమేకద చావు నరునకు
"యెక్కడెప్పుడు, యెటులగూడిన
నొక్కటే కాదా?

4 "మ్రిందుటన్నది బొందిమార్చుట
"ముందుభవమున కలుగువిభవము
"నందజేయుట కాదె, యేలిక!
దండమను మిషను?

5 "కాని యింటికిపోయి యొకతరి
కనులజూచెద నాలుబిడ్డల;
పనులు తీర్చుకు మరలివత్తును
యానతిండనియెన్."

6 వింతపలుకుకు విస్మితుండై
కొంత కరకరితీరి నరపతి,
"యింతయిట్టుల మిడునెవిద్య"ను
చింతచిగురెత్తన్.

7 అనియె నరపతి "యటులెకానిమ్ము
"వనికొంచము విపులమందురు;
"తనువుదాచను తగిన చోటులు
"కలవు యెటుజనినన్.

8 'మించుచతురత మాటవిరుపున
యెంచినాడవు చెడ్డమంచని;
'పంచ—ప్రాణములందు ప్రేముడి
'పరచునే? చెప్పుమా?

9 'ఆలుబిడ్డల చూతునంటివి;
ఆలకించిననారి శోకము
తొలగువిద్యలు, తొలగు ధైర్యము
తొలగు నీతైనన్-



10 "కాన నీకై తనువు నోడెశి
"వాని నొక్కనిజూపి చననగు;
మానవేశుని యానతప్పిన
మాయదేజగము?"

11 లేచిపలికెను పిరికిసప్పుడు;
"రాచసింగము! ఒడలి కొడలిదె
వేచియుంటిని బ్రతుకు ఫలముకు,
వారికె నీనాటన్,"

12 "ఐన, చనుమ "నెనవనిపతి, డా
మసుడు కొంచముతలచ, యిట్లను
పసువు, భటులను పనికి నిప్పుడె
పోవ నేనొల్లన్."

13 వొకటి తలచును నరుడు మది; వే
రొకటి తలచును బ్రహ్మ, వినమే?
పోకరాకల నడుమ నడ్డము
లెన్నితలపడునో?"

14 పొమ్ము; పొమ్మ"నె రేడు, "పొమ్మిట;
రమ్ము, యీనెలనిండు నింతకు;
లెమ్ము, చాలదెయదనుపో, రా,
నమ్ముగ దైసన్."

ii

15 కడలినడుమను కలదు సేమా
నసెడిద్వీపము కవులపుట్టిలు;
వాడి వేదల యినుని వేడికి
సీతువలికై నన్-

16 ఋతువు కొక్కొక్క వింతరూపం
బతులశోభా భాజనంబై
మతుల కొల్లలనాడు స్వర్గం
బేమొ మాసీమ!

17 అందునుండొక కొండకోనను
సుందరంబగు భవనరాజము;
విందుకనులకు కడలి యెదురై
లీలలో—లాడన్-

18 పక్షముల నారింజ, ఆలివు
వృక్షషండము [illegible]
ద్రాక్షపందిగ లింటిపంటలు
సొంపు పచరింపన్.

19 నవ్వులకు నెనరులకు నిత్తై
నివ్వటిల్లెను భవనరాజము;



పువ్వుకెత్తును దానినిలచిన
మొండు మనసైనన్-

20 తనయచందురు డబ్ధిసోకెను;
చదలవిడబడి, యిరులు ప్రాకెను;
అదునుకాంచిన రిక్కమూకలు
అంతటను ప్రబలెన్-

21 చారుతరముగ పసిడిపమిదల
బారుతీరివెలింగె జ్యోతులు;
వారియంత్రము తళుకు ముత్తెపు
సరులు విరజిమ్మెన్-

22 అలరుజిగురుల తోరణావళి
యలమిచుట్టెను జిలుగుకంబము
లుల్లమలరగ నాటపాటలు
పుమ్మిరయి సెలగెన్-

23 ఘుమ్ము, ఘుమ్మని కమ్మతావులు
గ్రమ్మెధూపము లాసవమ్ముల
దుమ్ము రేగెను నాటిపండువ
నిండువేడుకతోన్-

24 చుట్టలును మిత్రులును, భ్రాత్రులు
చుట్టుమూగుచు డమనుడిగిరి

"యెట్టివింతలు తెచ్చినాడవు?
కలదు వేడ్క, గనన్?"

25 పలికె డామను "యిలను దిమ్మరి
"పలు తెరంగుల జనులగాంచితి;
"తెలియనేర్చితి మర్మమెల్లను
వారివిద్యలలో-

26 మెరుగగాదని తొల్లివిబుధులు
మరుగుపరచిన మంతనంబుల
తిరుగుడులు మరలించితి, తీసితి
రాకశిప్పలలోన్-

27 వింత నొక్కొకదానికని, ముని
యింత కెక్కుడు లేదనంటిని
వింతలన్నిటి వమ్ముజేసెడి
వింతవినుడింకన్-

28 "ఒకడె" ఆయెను రెండుమూడులు
"ఒకడె" ఆయెను కోటిసంఖ్యలు
పెక్కులొక్కటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే!"

29 "నేను, తానను భేదబుద్ధిని
త్రేనికాగ 'హ' మొదవి డామను



కానివాడని తలచి ప్రాణము
గోలుపొమ్మనియెన్-

30 "ఒక్కవింతిది——పిరికి డామను
"నొకటి నొకటికి సమముకద? వే
రొకడు నాకయి ప్రాణమిచ్చిన
చాలదాయనియెన్-

31 "వింత రెండవదిద్ది—నృపుడును,
చింతవాపుచు వల్లెయనియె, న
నంతరము నేనిటకువచ్చితి
వింత కనగోరి-

32 "కాన, మీరల నెవ్వడిప్పుడు,
తాను, నేనను బుద్ధితలపక
తనువునాకై విడుచువాడ"న
పలుక డొకడైనన్-

33 చింతవంతలు చిత్రితములై
అంతకానగనయ్యె, మోముల
"వింతయిదె"యని పలికె డామను
వికసితాననుడై-

34 ఆటపాటలు అణగె నంతట;
మాటుమణిగెను భవనరాజము;

చాటుమాటున ఖ్వారజొచ్చిరి
సఖులు చుట్టములున్.

35 “కల్లఁజెప్పితి! “ననియె డామను
యెల్లరెప్పటియట్ల నలరుం
దుల్లముల!” వారప్పుడు “కొనుమిదె
ప్రాణములు” నన్నన్-

36 పంజరమ్ముల నున్న పిట్టలు
మంజులారణ్యములు నుగచెను
శింజితములతొ కాలిగొలుసులు
శిశుయని మరచెన్-

37 “దారిపోయే వారికొక్కటి
[1] కారవాసర కల్పనాయెను
దాతికాదది దరియటంచును
తలచుటొకవింత-

38 అనుచు, డామను డాసవమ్ముల
నానిపాడ దొడంగిమించెను
కానిపండువు నందు కొండొక
కలక కనసయ్యెన్-

iii

39 ఎల్లిపున్నమనంగ పితియను
యిల్లునందొకవిందు మిత్రుల

[1] కారవాసర=Caravansary.



కెల్లనాయెను, పితియసప్పుడు
పక్కనీపగిదిన్.

40 తెలియువాడన నొక్కడే భువి;
తెలుపువాడన నొక్కడేభువి;
పలు తెరంగుల సద్గుణాళికి
పట్టు వక్కండే!

41 కనియు, నేర్చుట, వానికడనే;
వినియు, నేర్చుట వానివలనే;
అనగవలెనా, అతడు డామను
డన్నమాటొకటి?

42 “లోకమందభిమాన ముంచియొ!
నాకు యశమొనగూర్చనెంచియొ,
నాకపతి, నామిత్రుడామను
గాక నడ్డదొకొ!

43 “బ్రతికి, చచ్చియు, ప్రజలకెవ్వడు
ప్రీతిగూర్చునొ, వాడెధన్యుడు;
బ్రతికి, డామను ప్రజలనేదును
చచ్చినేనొకడన్-

44 “మ్రిందుటన్నది బొందిమార్చుట;
ముందుభవమున కల్గువిభవము

నంద, ప్రాజ్ఞుడు వగవఁజెల్లునె
చెప్పుడీ" యనియన్.

45 "చదివిచెడితివి చాలున"నె నొక
"ద్రోద వెయశమ"ని బలికె నొక్కం
"డదనునకు డాసుడుగాడా
యనియె నొక్కరుడున్.

46 అంత పితియను కాంతపలికెను
కొంతగద్గదికంబు తోపగ,
"ఇంతవరకును ధైర్యమూనితి
మాటనమ్మికచే.

47 "నచ్చువాడయితేను డమనుఁడు
వచ్చునింతకె; చావుకోసము
యిచ్చగించుచు తానెవచ్చునె
పిచ్చివాడైనన్.

48 "నత్తునన్నను, వారివారలు
మొత్తమై తా మడ్డుపడరే!
పొత్తులన్నవి సంపదలకే
ఆపదలకగునే?

49 "వానినను కేలింత? సతితన
చాననెంచక, బలగమెంచక



తనుపుమిత్రుని కోడుటన్నది
తగన? ఇదిచెప్పుడా!

50 "కష్టసుఖముల కలిసి కుడుచుచు,
గోష్టిప్రాణంబంచు నెంచుచు,
ఇష్టవర్తననున్న చానను,
బాయుటొకమహిమా ?

51 "విందు, నీల్గుట నిక్కమాటను
యెందు, యెప్పుడైన నొకటని;
యెందరో కలరనెడు వారలు
లేరు చనువారల్.

52 చదువువారికి వెఱ్ఱిభ్రాంతులు
మెదడు కెక్కిన పాయవందురు;
ఆదనులేదే దేన్నికైనను
అందరెరుగనిదే?

53 పండగలదని కాయ కుడుతురె?
తిండియెల్లిది నేడు తిందురె
అండమందున చిలుకకలదని
అరచి జీరెదరే?

54 బతికవలసిన కాలముండగ
బతుకనొల్లనికంటె పుట్టునె

బతుకుదునిమిన బతుకు ఘోరము
పాయదే చెపుడా!

55 "అది యట్టుండగ దమను పైపగ
మదిదలంచిన మానవేశుడు
బదులుగాగొనె పాపమెరుగని
ప్రాణినేలనొక్కో?

56 "నరునిచావే కాంక్ష్యమేనియు
నరపతికి, నరులెందరనుదిన
మరుగువారలు యమునిప్పురమున
కంత తనియడొక్కో?;

57 "తప్పువొకయెడ దండమొకయెడ
యొప్పెయని, నరపతికిదోచిన
నప్పగించెద నాదుప్రాణము
దమనుకొన్నంతన్.

58 నీడవెలువడి నిలిచెనుండట
వేడ్కమోమున వెల్లివిరియగ
"వీడె దమనుండంచు నందరు
విస్మయము చెందన్.

59 ఆనుహోమతి; అంత వేరొక
యమితవిక్రము డతని కెదురై



"దమన! బతుకుము బతుకుమనె;
"శేడ"నిరి పలువురటన్.

60 పలికె నరపతి "మిత్రభావము
సలుపుడిక నీసఖుడు నీవును;
అలఘురాజ్యము ప్రేమసంపద
కలలియని దలతున్.

61 విద్యయందలి మాయమర్మము,
దద్దిచెప్పిం దబల యొక్కతె
విద్యలెరుగని ప్రేమభరమును
వింతగా చూపెన్.

62 వినగతగినది వింటినిచ్చట;
కనగతగినది కాంచినాడను;
మనుజులిద్దరు మగువయొక్కతె
మాన్యులీజగతిన్.

# ఆడపిల్లల పాటలు.

## పూర్ణమ్మ.

1 మేలిమి బంగరు మెలతల్లారా!
కలువలకన్నుల కన్నెల్లారా!
తల్లులగన్న పిల్లల్లారా!
విన్నారమ్మా యీకథను.

2 ఆటలపాటల పేటికలారా!
కమ్మనిమాటల కొమ్మల్లారా!
అమ్మలగన్న అమ్మలారా!
వినరమ్మ మీరీకథను.

3 కొండలనడుమను కోనొకటున్నది;
కోనకి నడుమా కొలనొకటుంది;
కొలనిగట్టునా కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

4 పూజారింటను పుట్టెనుచిన్నది
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ;
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకుపువ్వులు కోసేది.

5 ఏయేవేళల పూసేపువ్వుల
ఆయావేళల అందించి



బంగరుదుర్గను భక్తితొకొలిచెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ.

6 ఏయే ఋతువుల పండేపళ్ళను
ఆయాఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మా.

7 పళ్ళుమీరిన తీపులనడలను
పువ్వులుమీరిన పోడుములున్
అంగములందున అమరెనుపూర్ణకు
సౌరులుమించెను నానాటన్.

8 కాసుకులోనై తల్లీతండ్రీ
నెవరూన్యాయం విడనాడీ
పుత్తడిబొమ్మను పూర్ణమ్మనువొక
ముదుసలి మొగుడుకు ముడివేసీ.

9 ఆమనిరాగా దుర్గకొలనులో
కలకలనవ్వెను తామరలు;
ఆమనిరాగా దుర్గవనములో
కిలకిలపలికెను కీరములు.

10 ముద్దునగవులూ మురిపెంబు మరి
పెనిమిటిగాంచిన నిమిషమున

చూసెను కన్నియ ముఖకమలమ్మును
కన్నులగ్రమ్మెను కన్నీరు-

11 ఆటల పాటల తోటికన్నియలు
మొగుడుతాత యని కేలించ,
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుక్కించె-

12 కొన్నాళ్ళకుపతి కొనిపోవచ్చెను
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను;
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడిబొమ్మకు పూర్ణమకు-

13 పసుపు రాసిరి బంగరు మేనికి
జలకములాడెను పూర్ణమ్మ;
వదినెలు పూర్ణకు పరిపరివిధముల
నేర్పులు మెరసీ కై చేసిరి.

14 పెద్దలకప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించిరి;
దీవన వింటూ పక్కున నవ్వెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా!

15 చిన్నలనందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ;



అన్నల తమ్ముల నప్పుడు పలికెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా-

16 అన్నల్లారా తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ!
బంగరు దుర్గను భక్తితో కొలవం
డమ్మలకమ్మా దుర్గమ్మ

17 ఆయా వేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్ళన్నీ,
భక్తిని గోసి శక్తికి ఇవ్వం
డమ్మలకమ్మా దుర్గమ్మ-

18 నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొకతరి తలవండీ;
మీ మీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి-

19 బలబలకన్నుల కన్నీరొలికెను
పుత్తడిబొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా-

20 నగచిరి వదినెలు నగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టె

కాసుకులోనై అల్లునితలుచుకు
ఆనందించెను అయ్యోకొడె-

21 యెప్పటియట్టుల సాయంత్రమ్మున
యేరినపువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను గొలవను
వొంటిగబోయెను పూర్ణమ్మ-

22 ఆవులు పెయ్యలు మందలజేరెను ।
పిట్టలు చెట్లను గుమిగూడెన్!
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణను యింటికి రాదాయె.

23 చీకటినిండెను కొండలకోనల
మేతకు మెకములు మెసలజనెన్
దుర్గకు మెడలో హారములమరెను
పూర్ణమ యింటికి గాదాయె.

24 కన్నుల కాంతులు కలవలచేరెను
మేలిమిజేరెను మేనిపసల్!
హంసలజేరెను నడకలబెడగులు
దుర్గనుజేరెను పూర్ణమ్మ.

# దేశభక్తి

దేశమును ప్రేమించుమన్నా.

1 దేశమును ప్రేమించుమన్నా,
మంచి అన్నది పెంచుమన్నా,
వొట్టిమాటలు కట్టిపెట్టోయి
గట్టిమేల్ తలపెట్టవోయి.

2 పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి;
తిండికలిగితె కండకలదోయి,
కండకలవాడేను మనిషోయి!

8 యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయి.

4 అన్ని దేశాల్ క్రమ్మవలెనోయి,
దేశిసరుకుల నమ్మవలెనోయి!
డబ్బుతేలేనట్టి నరులకు
కీర్తిసంపద లబ్బవోయి.

5 వెనకచూసిన కార్యమేమోయి?
మంచిగతమున కొంచమేనోయి

మందగించక ముందుఅడుగేయి
వెనకపడితే వెనకేనోయి!

6 పూనుస్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే,
వ్యర్థకలహం పెంచబోకోయి
కత్తివైరం కాల్చవోయి!

7 దేశాభిమానం నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్;
పూనియేదైనాను వొకమేల్
కూర్చిజనులకు చూపవోయి!

8 ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయి,
ఒరులమేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి!

9 పరులకలిమికి పొర్లియేడ్చే
పాపికెక్కడ సుఖంకద్దోయి?
ఒకరిమేల్ తనమేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!

10 స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయి



దేశమంటే మట్టికాదోయి,
దేశమంటే మనుషులోయి!

11 చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి.

12 మతంవేరైతేను యేమోయి?
మనసునొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగి
లోకమున రాణించునోయి!

13 దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి,
నరులచమటను తడసిమూలం,
ధనంపంటలు పండవలెనోయి!

14 ఆకులందున అణగిమణగీ
కవితకోవిల పలకవలెనోయి
పలుకులనువిని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయి!

# ముత్యాలసరము.

వెల్లువగ నారోగ్య సంపద, లుల్లమలరుచు నిచ్చుగావుత.
తల్లిభారతమాతపంచమ, జార్జికెల్లప్పుడున్.

జార్జిసమ్రాట్ఛాసనంబుల, జాజిపూవులదండమాశ్కని
రాజరాజులు శిరములందున, దాల్చి మనవలయున్.

మర్మమెరుగనిధర్మమనియెడి, నిర్మలంబగునీతిపథమున
పేర్మిప్రజలనుమంచునేర్పరి, జార్జిమనవలయున్.

భరతఖండంబెన్న డెరుగని, నిరతశాంతినొసంగివిద్యల
నెరయనించినయాంగిలేయుల, రేడుమనవలయున్.

కొల్లబోతగజంపిశత్రుల, ఢిల్లి, పట్టముగట్టుబలిమిని
తొల్లినల్లని దేవుడొక్కడ, జాతశత్రునకున్.

తెల్లవారలు నీతినిపుణులు, ఢిల్లిపట్టము గట్టిరిపుడే
కల్లయెరుగని జార్జిరేని, కజాతశత్రునకున్.

నల్లవాడును తెల్లవాడును నెల్లశుభములగూర్చుగావుత
తల్లిమేరీమహారాజ్ఞికి జార్జినరపతికిన్.

# లంగరెత్తుము.

1 విరిగి పెరిగితి; పెరిగి విరిగితి;
కష్టసుఖముల పారమెరిగితి;
పండునన్నవి ఆశలెన్నో
యెండిరాలగ జాగిలితిన్॥

2 అందజాలని పళ్లకోసము
అఱ్ఱుజూపితి; నేలపాకిన
చెట్లపళ్లను విలవలెరుగక
పాదరక్షల మట్టితిన్॥

3 తీపివిరిగిన చెరుకువలె ఆ
నాటికోర్కెలు నేడుబెండై
ఉంచినవ్వితి; బుద్ధిచపలత
కొత్తకోర్కెల తగిలితిన్॥

4 దేవతలతో జోడు కూడితి;
రక్కసులతో కూడి ఆడితి;
కొత్తమిన్కుల తెలివిపటిమను
మంచి చెడ్డల మార్చితిన్॥

5 చూతునా! అని చూసితిని; మరి
చేతునా! అని చేసితిని; ఇక

చూడ చేయగరాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్॥

6 శత్రుమిత్రుల కిచ్చి నెనరులు
స్నేహవార్ధిని కొల్లగొంటిని;
నాటిమిత్రులు తరల శూన్యం
బైనపుడమిని నిలిచితిన్॥

7 పంజరంబున నున్నకట్లను
పగలదన్నగలేక సుక్కితి;
నింగిపర్వగ లేని జన్మము
నీరసంబని రోసితిన్॥

8 "ఉసురులకు విసికితినా? యుద్ధము
కలదు; దేశము కొరకు పోరుము"
యుద్ధమా? ఇక నేమి శోకము!
చాలు! చాలును! లంగరెత్తుము!

# కోరుకొండ.

కనులపండువయ్యెనగరు కాంతకంటివే.
విజయరామ నిర్మితమై
విమలప్రభా వర్మితమై
విబుధబలము కలిమి విజయ
శ్రీలనలరుచూ॥

కొండయిదా గోపురమా
దండినృపతి కాపురమా
రండు, కండు, ఆనంద మొందు
కలదెయింత మెందు॥

కోరుకొండ, కోర్కొండ, కోరకుండనిత్తు
వరములూర కుండవలదు రండు
రండనె నట నృపవరుండు॥

శుభవిభవములభయదాత ఇభరాట్
శ్రీవిజయరామ విభువరునకొసంగి
లలితలక్ష్మి బ్రోవగా॥

మాటమర్మ మెరిగినట్టి మేటికవుల జాడలరసి బోటి,
అప్పకవియమర్చె 'మాటలముత్యాలపేట॥

# దించు లంగరు.

1 దించులంగరు దీర్ఘయుద్ధం
ధర్మపథము ముల్లుచూపెను
నరుల పీనుగు పెంటపోకల
నాటి వెలయును శాంతివృతము.

2 పాతసంధులు పాతిపెట్టుము
యుద్ధముల కవి ఉనికిపట్టులు
లోకమంతయు ఏకమై
యుద్ధమునె మారణముచేయును.

3 వచ్చెనిదె బంగారుకాలము
వాంఛలెల్లను తీరు సుజనుల
కాంగిలేయుల ధర్మరాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్యమిచ్చుచు
సంతతము వర్ధిల్లుగావుత!

# దిద్దుబాటు.

"తలుపు! తలుపు!"

తలుపు తెరవఁబడలేదు. ఒకనిమిషమునకే దూరుకొనెను. గదిలోని గడియారము టింగుమనిఒంటిగంటకొట్టినది.

"ఎంత ఆలస్యము చేస్తిని! బుద్ధి గడ్డితిన్నది. రేపటినుంచి జాగ్రత్తగా వుంటాను. యేమంటి నాచల్లాపోయి సానిదానిపాట సరదాలో మనసు లగ్నమైపోయినది. ఒక్క పాట సరదాతో కుదరలేదు. మనిషిమీదకూడా సరదా పరిగెత్తుతూంది. లేకుంటే, పోకిరీ మనిషివలె పాట ముగిసినదాకా కూర్చోవడమేమిటి? యేదోవక అవకాశము కలుగఁ జేసికొని దానితో నాలుగుమాటలు ఆడడపు ఆసక్తియేమి? ఇదిగో లెంపలు వాయించుకుంటున్నాను. రేపటినుంచి మరి పాటకు వెళ్ళను. నిశ్చయం. నిశ్చయం......గట్టిగా పిలిచితే కమలిని లేవగలదు. మెల్లిగా తలుపుతట్టి రాముడిని లేపగల్గితినా చడీలేకుండ పక్కజేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును"

గోపాలరావు తలుపు చేతనంటగానే రెక్కవిడబారెను. "ఆశే యిదేమి!" అనుకొని, రెక్క మెల్లన తెరచి, నడవలో దీపము లేదు. అంగణముదాటి తన పడకగది తలుపుతీయు, నందును దీపము లేకుండెను. చడిలేక అడుగువేయుచు మంచము దరికిపోయి కమలిని నిద్రించుచుండెనా, మేల్కొని యుండెనా యని కనుగొన యత్నించెనుగాని, యేర్పరింపలే

